# ఆంధ్రపత్రిక

316910



The Andhra Patrika, Madras, } Regd No 1118, Vol, 34 No 139 FRIDAY 12th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# ఇండొచైనాకు ఫ్రెంచివారి శుద్ధనిరర్థక స్వపరిపాలనా ప్రతిపాదన

## కొత్త పథకం ప్రకటన

## రక్షణ, విదేశవ్యవహారాల బాధ్యతపూర్తిగా ఫ్రాన్సుదేనట

### ప్రతిపాదన సాంతంగా ఆమోదిస్తేనే ఒప్పుకుంటామని హెచ్చరిక

హనోయ్ (ఇండోచైనా), సెప్టెంబరు 10 ఫ్రెంచియూనియన్లోనే వుండేపద్ధతిమీద, ఇండోచైనాకు స్వపరిపాలనాధికారం ఇచ్చే విషయమై ఫ్రెంచి హైకమీషనరు ఎమిల్ బొల్లార్టు ఒకనూతన ప్రతిపాదనను ఈ రోజు ప్రకటించాడు. ఈ ప్రతిపాదన ప్రకారం దేశరక్షణ, విదేశవ్యవహారాలు మాత్రం ఫ్రెంచివారి చేతుల్లోనే వుంటవి. ఇండోచైనాలోని అనామ్, టోంకింగ్, కొచిన్-చైనాలు మూడు రాష్ట్రాలూ కలవటానికి నిశ్చయించుకుంటే తమకు అభ్యంతరంలేదనీ, అయితే ఈ విషయంలో వారిలో ఎవరైనా మిగిలిన వారిని నిర్బంధించటానికి ప్రయత్నిస్తే సహించమనీ బొల్లార్టు ప్రకటించాడు.

ఫ్రెంచి సేనలు మాత్రం ఇక్కడేవుండి దేశరక్షణను నిర్వహిస్తవి. అంతరంగిక శాంతిభద్రతల బాధ్యత మాత్రం రాష్ట్రపోలీసుదళాలకు వదిలివేయబడుతుంది. దేశరక్షణ, విదేశవ్యవహారాలు మినహా మిగిలిన పరిమిత పాలనాధికారాలను యోగ్యమైన ప్రజాసంస్థలకు దత్తతచేశారు.

"ఇండో చైనా పరిపాలనాధికారాలను కొన్ని పరిమిత సూత్రాల ననుసరించి ఇండో చైనాలోని యోగ్యమైన ప్రజాసంస్థకు ఒప్పగించాలని మేము వాంఛిస్తున్నాము. ఇండో చైనాను పరిపాలించాలని మాకు ఏకోశానా లేదు." అని ఇండో చైనాలో ఫ్రెంచి హైకమీషనర్ ఎమిల్ బొల్లార్టు హాయ్‌ఢోంగ్‌లో ప్రకటించాడు.

"శత్రువ్యక్తుల విషయంలో ఇక ప్రతి ఇండో చైనీయుడికీ వ్యక్తిగత బాధ్యత ఉంటుంది. ప్రజా ప్రాతినిధ్యం ఉన్న పాలనా శాఖలనూ, తమ ఆర్థిక విషయాలనూ, ఫ్రెంచివారితో ఏ మాత్రం ప్రమేయమూ లేకుండా ఇండోచైనీయులే నిర్వహించుకుంటారు. ఇది మనకు కూడా లాభదాయకంగావుంటుందని ఆశిస్తున్నాను.

ఇండోచైనాలోని అనామ్, టోన్‌కింగ్, కొచిన్-చైనాలు ఒకసమాఖ్యగా ఏర్పడే విషయంలో ఫ్రెంచివారేమీ జోక్యం కలిగించుకోరు. అది ఇండోచైనా ప్రజలే కలసి నిర్ణయించుకోవాలి. కాని వారిలో ఎవరైనా మిగిలినవారిని నిర్బంధించ ప్రయత్నిస్తేమాత్రం మేము సహించము. రాష్ట్రాలసమాఖ్య ఏర్పడినా ఏర్పడకపోయినా మేము అధికారదత్తత చేసాము.

ఇకనుంచీ అందరూ ఫ్రెంచి యూనియన్ పౌరులకిందనే భావించబడతారు. ఫ్రెంచియూనియనులోవుండటం అన్నివిధాలలాభదాయకం.

దేశరక్షణ కార్యనిర్వహణానికి ఫ్రెంచి సేనలు ఇక్కడేవుంటవి. ఫ్రెంచిరాజ్యాంగ ప్రణాళికలో 62 అంశం ప్రకారం ఫ్రెంచియూనియన్‌కి ఒకే సైన్యం, ఒకే విదేశవ్యవహారాలశాఖా వుంటవి. కాబట్టి ఈ రాష్ట్రాలలో శాంతిభద్రతలను కాపాడుతూవుండే పోలీసుబలాలన్నీ యుద్ధ సమయంలో ఫ్రెంచిసైన్యంలో కలిసిపోతవి. యూనియనంతా ఒకే ఘటంగా వ్యవహరించటంవల్ల ఇక్కడ సైనిక స్థావరాలను ఫ్రెంచి సైన్యం రక్షిస్తూవుంటుంది.

ఎకుమతి దిగుమతుల సుంకాలూ, నాణెములూ (కరెన్సీ) విదేశీయులను వలసానీయటమూ, మొదలైనవిషయాల్లో మూడు రాష్ట్రాలూకలిసి ఒక సమష్టి విధానాన్ని నిర్ణయించుకుంటే వారి ఆర్థికాభివృద్ధికి దోహదం కలగజేస్తుంది. ఇండోచైనాలో ఇండోచైనీయులకు సంబంధించిన విద్యావిషయకాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. యూనియన్‌లోని మిగిలినదేశాల్లో (ఫ్రాన్సులో తప్ప) ఇండోచైనా కు ఫ్రాన్సులో సమానమైన హక్కు ఉంటుంది ఈ ప్రతిపాదనను అంగీకరించే విషయంలో బేరాలు పనికిరావు. అంగీకరిస్తే అన్ని అంశాలూ అంగీకరించాలి లేకపోతే అసలు అంగీకారమే ఉండకూడదు. వీటికి అంగీకరించి శాంతిని నెలకొల్పటం, లేకపోవటం మీ మీదనే ఆధారపడివున్నది."

#### మాజీ చక్రవర్తి జోక్యం?

ఇండోచైనా మాజీ చక్రవర్తి బావోదాయ్ తిరిగి అధికారాన్ని స్వీకరించి శాంతిని నెలకొల్పే నిమిత్తం ఫ్రెంచివారితో సంప్రదింపులు జరపటానికి సిద్ధంగా ఉన్నాడని హాంకాంగ్ నుంచి వార్తలు వస్తున్నవి. బావోదాయ్‌ను అధిక సంఖ్యాకులు నాయకుడుగా అంగీకరిస్తే, అతనితో వ్యవహరించటానికి ఫ్రెంచి ప్రభుత్వానికి అభ్యంతరం వుండదని ఫ్రెంచి వలసరాజ్య కార్యాలయంలోని ఒక ఉద్యోగి అన్నాడు.

## రైలుబండ్లకు మిలిటరీ రక్షణ

### కొత్త ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: రైల్వేల రక్షణకోసం దండు సన్నద్ధంచేసి ఒక కొత్త ఆర్డినెన్సును అమలుపరిచినారు. ఈ ఆర్డినెన్సు వెంటనే ఇండియాలో ఉన్న అన్ని రాష్ట్రాలలోనూ అమలులోకి వస్తుంది.

రైల్వే ప్రయాణీకుల రక్షణకోసమున్నా గుడ్సుబండ్ల రక్షణకోసమున్నా నియమించిన మిలిటరీవారు ఎవరయినా తమ ధర్మములను నిర్వర్తించకపోయేట్లయితే వెంటనే కోర్టు మార్షల్‌వారు ఎమ్కరి విచారణచేసి పదిసంవత్సరాలకు తక్కువ లేకుండా శిక్ష వేయుడముకానీ మిలిటరివారి మూలముగా ప్రాణనష్టము అయినట్లయితే మరణశిక్ష విధించవచ్చును అన్నా ఈ ఆర్డినెన్సులో జరుగుతుంది.

## స్త్రీ పోలీసుదళం

ఢిల్లీ, సెప్టెంబర్ 10: ప్రస్తుత కల్లోలాల్లో చిక్కుపడ్డ స్త్రీలను వెదకి రక్షించేందుకు ప్రత్యేక పోలీసులుగా చేరవలసినదని ఇండియా ప్రభుత్వం స్త్రీలకు విజ్ఞప్తి చేసింది.

## "కాందిశీకసమస్య మన జాతికే సిగ్గుచేటు"

### కల్లోలాలకు ఉభయఅధినివేశాలూ పూర్తి బాధ్యతవహించాలని గాంధిజీ హెచ్చరిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: "ఇండియా పాకిస్థాన్‌లలో ఎక్కడ సంఘర్షణలు జరిగినా, ఉభయ డొమినియన్ల ప్రభుత్వాలూ సంపూర్ణబాధ్యత వహించాలి. గూండాలు చెలరేగి అకృత్యాలు చేస్తూ ఉంటే మేం నిస్సహాయుల మయ్యామని ఏ పక్షంవారూ తప్పించుకోవడానికి వీల్లేదు." అని మహాత్మాగాంధీ నేటి సాయంకాలం జరిగిన ప్రార్థన సమావేశంలో స్పష్టంగా ఉద్ఘాటించాడు.

కాందిశీక సమస్యను ప్రస్తావించి ఆయన ఇల్లా అన్నారు.

"ఈ దేశంలో అసలీ కాందిశీక సమస్య ఎందుకు వచ్చింది? ఇది మన జాతికంతకూ లజ్జాకారకం కాదా? క్వాయిదే ఆజాం జిన్నా, లియాఖత్ సాహెబు, తదితర పాకిస్తాన్ నాయకులందరూ కూడా పండిట్ నెహ్రూ, సర్దార్ పటేలులతోపాటు తమ తమ డొమినియనులలో మైనారిటీలను మెజారిటీలతో సమానంగా చూస్తామని అధికారం స్వీకరించడంతోనే లోకానికంతకూ చాటించారే? ఎందుకీ చాటింపు? తియ్యని మాటలతో ప్రపంచాన్ని మోసపుచ్చేందుకా? లేక తామన్నమాటను నిలబెట్టుకోవటానికి ప్రాణ త్యాగమైనా చెయ్యగలమనిబుజాపు చేసేందుకా? ఇదే నిజమయితే అనేక వేల హిందువులూ, సిక్కులూ, అమిలులూ, భాయిబంధులూ, వారి మాతృభూమియైన పాకిస్తాను నుండి ఎందుకు తరిమి వేయబడ్డారు? క్వెట్టా, నవాబుషా, కరాచీలలో ఏమిజరిగింది? పశ్చిమ పాకిస్తానులో జరిగిన ఘోర దురంతాలను గూర్చి విన్నా చదివినా ఆ కథలన్నీ హృదయ విదారకంగా ఉన్నాయే? ఇదేనా మైనారిటీలను మెజారిటీలతో సమానముగా చూడడం?"

కర్ఫ్యూ నిబంధనలవల్ల పద్యులు చాలా తక్కువగా ఉన్నా, తాము చెపుతున్న మాటలు ఢిల్లీ ప్రజలకందరకూ ఉద్దేశించినవే అని మహాత్మజీ ప్రార్థనానంతరోపన్యాసం ప్రారంభించారు. పాలెం స్టేషనులో గాంధీజీ దిగినపుడు ఆయనకు స్వాగత మివ్వడానికి సర్దార్ పటేల్, రాజకుమారీ అమృతకౌర్ ప్రభృతులు అక్కడికి వచ్చారు. సాధారణంగా సర్దార్ ముఖములో తాండవించే చిరునవ్వు గాని ఆయన సహజహాస్యంగాని ఆనాడు అదృశ్యమయ్యాయి రైలులోనుంచి దిగడంతోటే తాను కలుసుకొన్న ప్రజలలోనూ పోలీసులలోనూ కూడా తమచుట్టూ అవరించిన అంధకార మాలిన్యమే విస్పష్టంగా కనిపించింది ఎంతో ఉల్లాసంగా ఉండే భారత ప్రధాన నగరం ఢిల్లీ ఈ నాడు శ్మశానవాటిక అయిందా? అని మహాత్మజీ అడిగారు.

గాంధిజీకి మరొకవిషయంకూడా ఆశ్చర్యం కలిగించింది ఆయన కెప్పుడూ భంగీకాలనీలో ఉండడమే ఇష్టం అయినా ఈసారి ఆయనను బిర్లాభవనానికి తీసుకుపోయారు. భంగీసోదరులతో ఉన్నా బిర్లాభవనంలో ఉన్నా తమ కాతిథ్య మిచ్చేది బిర్లాసోదరులే అయినప్పటికీ ఆయనకు భంగీకాలనీలో ఉండడంఇష్టం అయితే ఆ ప్రదేశం యావత్తు రక్షణార్థు కావాసప్రదేశంగా పరిణమించడంవల్ల తమ అవసరంకంటె వారి అవసరం కాబట్టి ఇప్పుడీ మార్పు జరిగింది.

తర్వాత గాంధీజీ కాందిశీకసమస్యను ప్రస్తావించి దేశంలో ఎక్కడకల్లోలం జరిగినా ఉభయ డొమినియన్ ప్రభుత్వాలూ సంపూర్ణ బాధ్యతవహించి తీరాలని హెచ్చరించి ఇదివరలో జిన్నా, లియాఖత్ ఆలీ, పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ మొదలైన ఉభయడొమినియన్ నాయకులూ మైనారిటీల సంరక్షణను ప్రథమ కర్తవ్యంగా భావిస్తామని చెప్పింది

8వ పేజీ చూడుడు

### గాంధీజీతో నాయకుల సమావేశం

ఢిల్లీ, సెప్టెం. 10: పండిత నెహ్రూ, పట్టాభి సీతారామయ్య, కృపలానీ, ఆసఫ్ ఆలీ గారలు ఈ వేళ మధ్యాహ్నం గాంధీజీని కలుసుకున్నారు.

మౌంట్‌బాటన్ ప్రభ్వి గౌరవలాంఛనంగా ఈ వేళ గాంధీజీని దర్శించింది.

## మధ్యజావాలో పెద్దఎత్తున డచ్చిదాడి

### విమాన, టాంకుదళాల ప్రయోగం

బటేవియా, సెప్టెంబరు 10: మధ్యజావాలో సెమరాంగ్ ప్రాంతంలో డచ్చివారు పెద్ద ఎత్తున దాడిని ప్రారంభించారని ఈవేళ రిపబ్లికన్ వార్తలు ప్రకటించినవి ఈదాడిలో టాంకులు, సాయుధమోటార్లు, విమానాలు పాల్గొన్నవి

తూర్పుజావాలో మలంగ్ దగ్గరవున్న పగియామీద డచ్చి బాంబరు విమానాలు దాడిచేసినవి.

నిన్న ఇండోనేసియా మొత్తంలో 14 సంఘర్షణలు జరిగినవనీ, పడమటి జావాలో రిపబ్లికన్ ఒత్తిడి ఎక్కువగా ఉన్న ఫంకలన్‌లో డచ్చిసైన్యం ఉంచబడ్డదనీ డచ్చి సైనికవార్త తెలియజేస్తున్నది. గొంబోంగ్ యుద్ధరంగంలో ఇద్దరు జపాన్‌వారూ, తూర్పు జావారంగంలో 5గురు మాజీ జర్మన్ నావికులూ రిపబ్లిక్ పక్షాన పోరాడి మరణించారని ఈవార్త ప్రకటిస్తున్నది.

సుమత్రాలో మాజీ సహాయ గవర్నర్ (రిపబ్లికన్) గా ఉన్న డా॥ మహమ్మద్ ఈసాను డచ్చివారు అరెస్టుచేశారు.డచ్చి ఆక్రమిత ప్రాంతాల్లోని రిపబ్లికన్ గెరిల్లాలకు ఇతడు ధనసహాయం చేస్తున్నాడని ఆరోపించబడ్డది.

### త్వరలో డచ్చి పరిష్కారం?

హేగ్, సెప్టెంబర్ 10: 'ఇండోనేసియా వ్యవహారాన్ని గురించి డచ్చి ప్రభుత్వం వచ్చేవారం నిశ్చయంగా ఒక ప్రకటన చేస్తుంది." అని పార్లమెంటులో రెండో-భ అధ్యక్షుడు ప్రకటించాడు.

## పర్షియన్ పెట్రోల్ గనులు

### పర్షియా ఇవ్వకపోతే సోవియట్ సేనలు దండయాత్ర సాగిస్తవా?

లండను, సెప్టెంబరు 10: టెహరాన్‌పై దండయాత్రకు సోవియట్ సైన్యాలు సన్నాహాలు చేస్తున్నాయని పుకారులు వస్తూ ఉండడంవల్ల పర్షియాలో ఆందోళన బయలుదేరింది.

సోవియటు రష్యాకు నూనెగనులను అనుమతించడానికి మజ్లిస్ అంగీకరించాలని రష్యా కోరడంతో ఈ సంచలనం బయలుదేరింది మజ్లిస్ ముందునూచనలను నిరాకరించినట్లయితే, తర్వాత సంప్రతింపులకు అవకాశం ఇవ్వాలని పర్షియాకు బ్రిటను సూచించిందని టెహరాన్ నుంచి వచ్చిన వార్తలు తెలుపుతున్నాయి అమెరికా తనకు సహాయం చేస్తుందని అనుకుంటున్న ప్రధాని ఆశకూడా నిరాశ అయినట్లు తెలుస్తున్నది. పర్షియా ప్రధాని ఇప్పుడు సోవియటు రాయబారితో చర్చించి రష్యాకు నూనెగనుల నప్పగించేందుకు కొత్తసూచనలు తయారు చేస్తున్నాడని కూడా తెలుస్తున్నది.

### లార్డ్ లిస్టోవెల్

కలకత్తా, సెప్టెంబరు 10: బ్రిటిష్ ప్రభుత్వంలో బర్మా వ్యవహారాలమంత్రి లార్డ్ లిస్టోవెల్ ఈ వేళ రంగూన్ నుంచి ఢిల్లీ వెడుతూ ఇక్కడ కొంచంసేపు ఆగాడు.

### పాకిస్థాన్‌తో జునాగడ్ ఒడంబడిక

కరాచీ, సెప్టెంబర్ 10: సెప్టెంబర్ 9 వ తేదీన పాకిస్థాన్, జునాగఢ్ సంస్థాన ప్రభుత్వాలకు ఒక యథాపూర్వపు ఒడంబడిక జరిగినదని పాకిస్థాన్ విదేశమంత్రి కార్యాలయంవారు ఈవేళ ప్రకటించారు.

## బ్రిటిష్ సేనల ఉపసంహారం

### ఈ సంవత్సరాంతం లోపుగా పూర్తిచేయడానికి బ్రిటిష్ ప్రభుత్వ సంకల్పం

లండన్, సెప్టెంబరు 10: పాకిస్తానులోనూ ఇండియాలోనూ ఉంటూఉన్న బ్రిటిషు సేనలను ఈ సంవత్సరాంతానికి పిలిపించి వేయవలెనని బ్రిటిషు ప్రభుత్వము వారు దృఢముగా సంకల్పించు కొన్నారు. రవాణా సౌకర్యాలు చిన్నగా లేకపోయినందువల్ల బ్రిటిషు సేనను తీసుకొని రావడానికి వీలులేకపోయిందనీ ఆగష్టు 15 వ తేదీ రోనే ఆ సేనను తొలగించి ఉండవలసిందనీ ఇప్పుడు బ్రిటిషువారికి కలిగిన ఆర్థిక విపరీతావస్థనుంచి వారిని సాధ్యమయినంత త్వరలో తొలగించ తలచినారనిన్నీ తెలుస్తూఉంది.

### అస్సాము హైకోర్టు

#### శాసనసభ ఏకగ్రీవామోదము

షిల్లాంగ్, సెప్టెంబరు 9: అస్సాము శాసనసభ వారు అస్సాములో హైకోర్టును స్థాపించవలెనని ప్రధాన మంత్రి గోపినాథ బార్డొలాయి ప్రతిపాదించిన తీర్మానాన్ని ఏకగ్రీవముగా ఆమోదించినారు. ఈ అస్సాము హైకోర్టును గౌహతిలో స్థాపిస్తారు. సొంతభవనము కొండాకారాలకిన్నీ ఇంకా ఇతర ఆరంభ ఖర్చులు పది లక్షల రూపాయలు అవుతవి.

## మాకురక్షకుడు మహాత్ముడే

### పాకిస్థాన్‌లో భిక్షాటనం చెయ్యాలంటే అక్కడికి పోమని ముస్లింల విస్మయం

#### ఢిల్లీలో గాంధిజీ పర్యటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: మహాత్మాగాంధీ ఇవ్వాళ ఢిల్లీలోనూ దానికి సమీపంలో ఉన్న ఓఖ్లా ప్రాంతంలోనూ దాదాపు 40 మైళ్లు పర్యటించి అనేకరక్షణ శిబిరాలను సందర్శించారు. వారివెంబడి శ్రీమతి సుచేతాకృపలానీగారుకూడా ఉన్నారు.

ఉదయం 11 గంటలకు బిర్లాభవనంలో బయలుదేరి హుమయూన్ గోరీసమీపంలో ఉన్న రక్షణశిబిరంవద్దకు వెళ్లారు. అక్కడ చాలామందిమహమ్మదీయులకుఆశ్రయమిచ్చారు. వీరంతా ఢిల్లీ చుట్టుప్రక్కల ప్రదేశాలవారు. శిబిరాన్ని సంరక్షిస్తున్న ఒకముస్లిం గాంధిజీని సమీపించి 'మమ్మల్నందరినీ పాకిస్థానుకు రమ్మన్నారుగాని అక్కడికివెళ్లి మేము భిక్ష మెత్తుకోవలసి ఉంటే వెళ్ళడమెందుకు?' అని అన్నాడు. చాలామంది శరణార్థులు తమకు రక్షణ ఇవ్వగల మహానుభావుడు మహాత్మాగాంధీ ఒక్కరే అని అన్నారు.

అతర్వాత మహాత్మాగాంధీ ఓఖ్లాలో జమియామిల్లియాను (విద్యాసంస్థ) సందర్శించారు. అక్కడ వారికి డా॥ జకీర్ హుస్సేన్ స్వాగతమిచ్చారు. ముస్లిం శరణార్థులు వారివారి గ్రామాల్లో కల్లోలం ఎల్లా బయలుదేరిందో గాంధిజీకి విన్నవించుకున్నారు. తల్లిదండ్రులను దుర్మార్గులు చంపివెయ్యగా మిగిలిన ఒక పసిపాపను ఆయనకు చూపించారు. గాంధీజీ ముస్లిం స్త్రీలను ధైర్యంగా ఉండవలసిందని ఉద్బోధించారు.

జమియామిలియా గాంధీ బృందం చాందినీ చౌకువద్దకు వెళ్లింది... దారిలో గాంధిజీ కస్తూరిబా బాలికాశ్రమంవద్ద ఆగి నవఖాలీనుంచి ఇదివరలో వచ్చిన మాతాపితృవిహీనులైన ఇద్దరు పిల్లలను కలుసుకున్నారు. వారు బెంగాలీ మరిచిపోయారట. హిందూస్తానీ మాట్లాడుతున్నారు. కాబట్టి బెంగాలీ మరిచిపోయినా మంచిదే అని గాంధిజీ అన్నారు.

దీనాను హాలుశిబిరం, వేవెల్ కాంటీన్, కింగ్స్‌వే శిబిరం సందర్శించి గాంధిజీ వస్తూ ఉండగా అప్పుడే దుర్మార్గులవల్ల దెబ్బలుతిన్న ఒకవ్యక్తి సమగాత్తుకవచ్చి ఆయనతో మొరపెట్టుకున్నాడు.

బిర్లాభవనానికి వెళ్లేదారిలో గాంధిజీ హరిజనసేవక సంఘంవద్ద కొంతసేపు ఆగారు. జమియామిల్లియావద్ద దిగినపుడు తలుపు నొక్కుకొని గాంధిజీ వేలు కొంచెం నలిగింది

ఇవ్వాళ ఉదయం రాష్ట్రపతి ఆచార్యకృపలానీ గాంధిజీతో ఒక గంటసేపు సంభాషించారు.

### స్వగృహాలకు వెళ్లాలని శరణార్థుల వాంఛ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: ఒక పాతకోటలో 6 నుండి 8 వేల శరణాగతులు చేరుటవల్ల నాజిముద్దీన్ పరిసరములప్రజలు భయభ్రాంతులైరి భారత సైన్యమునకు చెందిన ఒక పెద్దఅధికారి ఆ స్థలమునకు వచ్చి చూడగా తమ స్వగ్రామములకు తిరిగి వెళ్ళ వాంఛ శరణాగతులు వెల్లడించిరి. ఈ శరణాగతులలో విశేషభాగము ముసలివారు, స్త్రీలు, పిల్లలు. జనసమూహములు దాడిచేయుటకను వదంతులు నిరాధారములని తెలియవచ్చెను.

ఒక పెద్ద సైనికాధికారి బహదూర్ ఘర్‌గోడ్డు, కిషన్‌గంజ్, సరాజ్‌గంజ్ ప్రాంతములకు వెళ్లి నప్పుడు ముష్కరులు యిద్దరు తుపాకులు బట్టుబట్టి చేతిని కాల్పులు చేయుటచేతను చాలామంది తమ యిండ్లు వాకిళ్లు వదలి పారిపోవుచుండిరి. ఈ ఆఫీసరుతో నుండిన ఇద్దరు సిపాయీలు తుపాకులు కాల్చి దుర్మార్గులు చేయుచుండిన 8 గురిని చంపివేసిరి. ఈ ప్రాంతములకు క్రొత్తసైనికులను, తీసుకొనివచ్చిరి. ఈ ప్రాంతములయందలి కొన్ని భాగములలో సోదాలుచేసిరి. ఇంకా పంక్షోభము జరుగకుండా సైనికులను నియమించుట చేత వెళ్లిపోయినవారు తమ గృహములకు తిరిగివచ్చున్నారు. అ. ప్రె.

## ఏ. ఐ. సి. సి. వాయిదా

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: 'మతసంఘర్షణలు విపరీతముగా నుండుటచేతను, రాకపోకల సౌకర్యములకు విఘ్నాతి కలుగుటచేతను, ప్రజాసేవకులు శాంతిస్థాపనకు కృషిచేయుచుండుట చేతను, యీ సెప్టెంబరు 27 న బొంబాయిలో జరుగవలసిన అఖిల భారత కాంగ్రెస సంఘ సమావేశము వాయిదా వేయబడినది అని అఖిల భారత కాంగ్రెసు సంఘ అధ్యక్షుడుఆచార్య కృపలానీ గారు నేడొక ప్రకటనచేసిరి.

అప్పుడే జరుగుటకు నియమింపబడిన ఇతర సమావేశములు కూడ వాయిదా వేయబడినవి. పరిస్థితులు చక్కబడగనే పర్యాంకమి కే సమావేశము యెప్పుడు యెక్కడ జరుగునదినిశ్చయమైనదీ ప్రకటింపబడగలదు.

## జమీందారీ రద్దుబిల్లుకు మంత్రివర్గ ఆమోదం

మదరాసు, సెప్టెంబరు 11: నిన్న జరిగిన మంత్రివర్గ సమావేశమును గురించి అధికారపూర్వకముగా ప్రభుత్వము నేడు ఒక ప్రకటనచేసెను.

జమీందారీబిల్లు సిద్ధాంతములను అంగీకరించుచును, రైతురక్షణబిల్లు మంత్రివర్గ వ్యవసాయ ఉపసంఘమునకు పంపుచును, జాతసిఫారసు బిల్లులో న్యూయార్కు కాటన్ మార్కెటును గూర్చి చేర్చబడెను, హిందూమతాదాయముల బోర్డు రద్దుచేయుచును, ఆ విషయమై మరియొక సమగ్రమైన బిల్లు తయారు చేసి ప్రతిపాదించుటకును మంత్రివర్గ సమావేశములో తీర్మానించిరి.

## తుంగభద్రాప్రాజెక్టు విషయంలో భేదాభిప్రాయ పరిష్కార యత్నం

### విశ్వేశ్వరయ్యగారి అధ్యక్షతను సమావేశం

బెంగుళూరు, సెప్టెంబరు 10: తుంగభద్రా ప్రాజెక్టు విషయములో మద్రాసు ప్రభుత్వమువారికిన్నీ హైదరాబాదు ప్రభుత్వమువారికిన్నీ వచ్చిన తగాదా పరిష్కారము కోసము ఉభయప్రభుత్వాల ప్రతినిధులున్నూ రేపటిదినము హోసపేటలో సమావేశము అవుతారు. ఈ సభకు యం. విశ్వేశ్వరయ్యగారు అధ్యక్షతవహిస్తారు.

మదరాసు స్పెషల్ చీఫ్ ఇంజనీరు దివాన్‌బహదూరు యణ. గోవిందరాజయ్యంగారు మదరాసు ప్రభుత్వముతరఫున హైదరాబాదు ప్రభుత్వ చీఫ్ ఇంజనీరు యస్.యం. యూనిస్ హైదరాబాదు ప్రభుత్వము తరఫున వారివారి వాదాలను సమావేశము వారికివెల్లడిస్తారు.

## బెజవాడ మ్యునిసిపల్ ఎన్నికలు

### కాంగ్రెస్‌వాదుల ధిక్కారణ

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, ఎం. ఎల్. ఏ. మ్యునిసిపలు ఎన్నికల వోటర్లకు యీ క్రిందివిధముగా విజ్ఞాపించుచున్నారు.

కొందరు కాంగ్రెసువాదులు బెజవాడ మ్యునిసిపలు ఎన్నికలయందు అభ్యర్థులుగా నుండుటకు దరకాస్తుచేసిరి. కాని వారు అభ్యర్థులుగా కాంగ్రెసు కమిటీచే నియమింపబడలేదు. అందువల్ల వారు కాంగ్రెసకు ఎదురు తిరిగి కాంగ్రెసు అభ్యర్థులకు ప్రతికూలంగా తిమంతట తాము ప్రత్యర్థులుగా నిలువబడి పోటీ చేయుచున్నారు. ఈరీతిగా కాంగ్రెసువాదులు నీతి నియమము తప్పి ప్రవర్తించడం కాంగ్రెసు నియమ శిక్షణమునకు విరుద్ధము. కాంగ్రెసుకు అప్రతిష్ఠను చేకూర్చును. ఇట్టివారిలో కొందరు కాంగ్రెసు అభ్యర్థులకు ప్రతికూలురైన తదితరులు పక్షము చేరి వారికి యీ ఎన్నికలలో సాయము చేయుచున్నారు. బెజవాడలో యిటువంటి కాంగ్రెసు ధిక్కారులు తామే నిజమైన కాంగ్రెసు అభ్యర్థులమని చాటించుచు గోడ నోటీసులలో ప్రకటనలు చేయుచున్నారు. తమకు యివ్వకలసిన వోట్లు నీలవన్నపు ధర్మ చక్రంగల పచ్చ పెట్టెలో వేయవలెననియు త్రివర్ణ శోభితమైన పెట్టెలో వేయవలెననియు అందుకొరకే తమవోట్లకు అటువంటి బాలటు పెట్టెలు ఏర్పాటు చేయబడెననియు అవియె అసలైన కాంగ్రెసు వోట్లపెట్టెలనియు ప్రచారము చేయుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు అట్టి ధిక్కారులపై క్రమశిక్షణ చర్యలను జరుపదలంచి యున్నారు. ఇటువంటి రంగుల పెట్టెలను కాంగ్రెసు అభ్యర్థులు కానటువంటి వారికి నిర్దేశించుట జనవంచన మనియు అట్టిభ్రమ ప్రమాద జనకమైన రంగుల పెట్టెలను నిర్ణయించుట కూడదనియు ప్రభుత్వము వారికి విజ్ఞాపింపబడెను. ఈ పిటీషను ప్రభుత్వముయొక్క విచారణలో నున్నది. వోటరు యీ మోసములో పడరాదనియు చాల మెలకువగా నుండవలెననియు మనవి చేయుచున్నాను.

## స్థానిక సంస్థల ఎన్నికలు

### సోషలిష్టు పార్టీ

బెజవాడ, సెప్టెంబరు 6: ఆంధ్రరాష్ట్ర సోషలిష్టు పార్టీ కార్యదర్శి మునునూరు బాలకృష్ణగారు యిట్లు ప్రకటించుచున్నారు.

"స్థానిక సంస్థలఎన్నికలలో పార్టీ వైఖరి తెలియపర్చవలసినదిగా పార్టీసభ్యులు మిత్రులు జాబులువ్రాయుచున్నారు. ఎన్నికల సందర్భంలో సోషలిష్టుపార్టీకి ఏవిధమయిన ప్రమేయమూ లేదని పార్టీ సభ్యులు, మిత్రులు గమనింప ప్రార్థన.

### అనంతపురం కాంగ్రెస్ అభ్యర్థులు పోటీలేని ఎన్నిక

అనంతపురం, సెప్టెంబరు 5: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో ము..స్గురు పోటీలేకుండ ఎన్నికయారు.

### చికాకోల్

చికాకోల్, సెప్టెంబరు 6: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో పోటీ లేకుండా 4 గురు ఎన్నికయారు. మిగతా 12 స్థానములకు 23 గురు అభ్యర్థులు పోటీ చేయుచున్నారు.

### ఏలూరు

ఏలూరు, సెప్టెంబరు 4: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో 10 మంది కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికయారు.

### అనకాపల్లి

అనకాపల్లి, సెప్టెంబరు 6: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో తొమ్మిది మంది పోటీలేకుండా ఎన్నికయారు.

### నరసారావుపేట

నర్సారావుపేట, సెప్టెంబరు 4: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో పోటీలేకుండా 6 గురు ఎన్నికయారు. మిగిలిన 12 స్థానములకు 34 అభ్యర్థులు పోటీ చేయుచున్నారు.

### 'అభ్యర్థి ఏ పక్షంవాడు?'

#### ఏలూరు మునిసిపలు ఎన్నికల నామినేషనులు

ఏలూరు, సెప్టెంబరు 4: మ్యునిసిపలు ఎన్నికల నామినేషన్ల ఆఖరి జాబితా నిన్న మునిసిపలు స్పెషల్ ఆఫీసర్ శ్రీ డి. వి. బి. వెంకట్రావుగారు ప్రకటించారు. ఈ ప్రకటన అయిన పిమ్మట ప్రస్తుతం ఎన్నికలలో పోటీ చేస్తున్న వివిధపార్టీలకు, వారివారి రంగులు నిర్ణయించేందుకు, పార్టీ నాయకుల్ని, తమ తమ పార్టీ అభ్యర్థుల జాబితా తీవ్వమని స్పెషల్ ఆఫీసరుగారు కోరారు. కాంగ్రెసు తరఫున శ్రీ కేలం అప్పల స్వామి (పట్టణ కాంగ్రెసు సంఘ కార్యదర్శి)గారున్నూ, తమ పార్టీ తరఫున నాజీ చేర్మను శ్రీ దాసురాజు వెంకట్రావుగారు, అభ్యర్థుల జాబితాలు దాఖలు చేశారు. క్రైస్తవ స్థానానికి పోటీచేస్తున్న అభ్యర్థులలో ఒకరైన శ్రీ కె. ఎస్. డి. వి. ప్రసాదరావుగారి పేరు రెండు జాబితాల లోనూ ఉండడం గమనించి, వారికి ఏ రంగు ఇవ్వాలో స్పెషల్ ఆఫీసరు గారు ఉభయపార్టీలనూ అడిగారు. కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కేలం అప్పలస్వామి గారు రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు నిర్ణయించి తమకు పంపిన కాంగ్రెసు అభ్యర్థుల పట్టికలో శ్రీ ప్రసాదరావుగారి పేరుకూడా ఉన్నది కనుక వారు కాంగ్రెసు అభ్యర్థిగనుక, వారికి కనుపురంగు ఇవ్వవలసింది అని అన్నారు. శ్రీ దాసురాజు వెంకట్రావుగారు, ప్రసాదరావుగారు తమపార్టీ తరఫున నామినేషన్ దాఖలు చేశారనీ, వారెన్నడూ కాంగ్రెసు అభ్యర్థిత్వము కొరకు అప్లికేషన్ పెట్టలేదనీ, వారిని రాష్ట్ర కాంగ్రెసు సంఘం వారు కాంగ్రెసు అభ్యర్థిగా నియమించిన సంగతి కూడా వారికి తెలియదనీ, అన్నారు.

ఈ సందిగ్ధ సమయంలో ప్రసాదరావు గారు వచ్చారు. వారు తాము శ్రీ వెంకట్రావుగారి పార్టీ తరఫున పోటీచేస్తున్నామనీ, తమకు గులాబీరంగు యివ్వవలసిందనీ, రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు, తన అనుమతి తీసికొనడంగాని, చివరకు తనకు తెలియపర్చడం గాని లేకుండా తన్నెలా అభ్యర్థిగా నియమించారో తనకు తెలియకుండా ఉందనీ, తానెన్నడూ ఏ కాంగ్రెసు సంస్థకూ అభ్యర్థిత్వానికి అర్జీ పెట్టలేదనీ అన్నారు. (స్వ. వి)

## మదరాసు సరిహద్దుల రక్షణ

### విశ్వనాధంగారి తీర్మానం

మద్రాసు అసెంబ్లీ కాంగ్రెసు పార్టీలో శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు యీదిగువ తీర్మానం ప్రతిపాదింప నోటీసు యిచ్చిరి.

"ఒరిస్సా గవర్నరుగారు ఆగస్టు 27 తేదీన ఒరిస్సా శాసనసభలో ఉపన్యసిస్తూ, బయట రాష్ట్రాలలో నుండి పోయిన ఒరిస్సావారిని ఒరిస్సాలో చేర్చుటకును, అందుకై ప్రత్యేకప్రభుత్వ శాఖను నియమించి, ఒరిస్సావారి హక్కులను కాపాడుటకు అధికారేతర శాసన సభ్యుల ఉపసంఘమును నియమించుటకు చర్య తీసుకొనబడునని చెప్పినందున మదరాసు ప్రభుత్వంవారు (1) ఉత్తరమున యీరాష్ట్ర సరిహద్దులను హక్కులను రక్షించుటకునూ, ఎక్కువమంది తెలుగువారు గల్గినా, ఒరిస్సాలో మదరాసు ప్రభుత్వంవారు వద్దంటున్నా 1936 లో ఒరిస్సాలో చేర్చబడిన ప్రాంతాలను తిరిగి యీ రాష్ట్రంలో చేర్చుటకును; ప్రత్యేక ప్రభుత్వశాఖను నియమించమని ప్రభుత్వంవారిని యీ సభవారు కోరుచున్నారు."

### రైతులకు ఎరువుల పంపక విధానం

మద్రాసు, 10-9-47. పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామ్మారెడ్డి సూర్యనారాయణగారున్నూ, జిల్లా కిసాన్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కామ్మారెడ్డి సత్యనారాయణ వ. ప్రసాదరావు గారున్నూ, యింకా కొంతమంది రైతునాయకులతో వ్యవసాయశాఖామాత్యులు శ్రీ మాధవమీనన్ గారిని వారి యింటియొద్ద ది 10-9-47 తేదీన కలసుకొని రైతులకు ఎరువులు, జనపవిత్తనాలు దొరకక చాల కష్టపడుతూ అవుసరము వచ్చేటప్పటికి నిమిత్తం బ్లాక్ మార్కెటులో విపరీతమైన ధరలతో కొనవలసివచ్చి రైతులకు చాల ఇబ్బంది కలుగుచున్నదనియూ, వెంటనే చేయవలసిందిని, జనపవిత్తనాలు, ఎరువులను సగకులకు వెంటనే కమాండ్ చేసి డిపార్టుమెంటు ద్వారాగాని, ఉత్పత్తిదారుల సహకార సంఘముల ద్వారాగాని రైతులకు అందజేయవలసినదిగాకోరిరి.

విషయములన్నీ మంత్రిగారు సావధానము విని, జనప విత్తనాలు త్వరలోనే న్యాయమైన కంట్రోలు రేట్లకు దొరకుటకు ఏర్పాట్లు చేయించుతాననియూ, పేరు కేక్ పిండి జిల్లావారీగా కోటావిధానము పై పంపకం జరుపుటకు ఏర్పాట్లు చేయుచున్నట్లు చెప్పినారు.

### ఎన్నికలలో రంగులు

మదరాసు ప్రభుత్వమువారు మునిసిపలు ఎన్నికలలో అభ్యర్థులకు రంగుల గూర్చి 9 వ తేదీ నొకప్రకటనగావించిరి. స్వతంత్రంగా నిలిచిన అభ్యర్థులకు నా ప్రసిద్ధ రాజకీయ పార్టీల రంగులుగాని, వాటితో కలిసినరంగులుగాని, ఆరంగులపై గీతలు గుర్తులుగాని యిచ్చినచో ఆ అభ్యర్థులు ఆ పార్టీలకు చెందినవారనే అభిప్రాయం కలుగును. అట్లాటిపార్టీలరంగులు కొందరు స్వతంత్ర అభ్యర్థులకు ఎన్నికల ఆఫీసరులు నిర్ణయించినట్లు తెలిసింది. అది ఎన్నికల నిబంధనలకు విరుద్ధం కనక, ఆ రంగులుమార్చి వేరేరంగులు ఏర్పాటు చేయాలని గవర్నరుగారు ఉత్తరువుచేయుచున్నారు.

## టెండర్లు

### ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.

వాల్తేరులోని, యూనివర్సిటీ కాంపస్‌లో ఇండస్ట్రియల్ లేబరేటరీ అమర్చబడు మెషినుల పునాదులు వేయుటకు షెడ్యూలు కంట్రాక్టుపద్ధతిక్రింద, సీలుచేసిన టెండర్లు, వాల్తేరు, ఆంధ్ర యూనివర్సిటీ రిజిస్ట్రారు గారిచే, 22-9-1947 తేదీ సోమవారము పగలు 12 గంటలవరకు తీసికొనబడును. షెడ్యూళ్లు, ప్లానులు, స్పెసిఫికేషనులు మున్నగునవి రిజిస్ట్రారు గారికి రు 2/-లు చెల్లించి పొందవచ్చును.

Edited Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty St. Madras

# 'దేశంకోసం త్యాగం చేసిన వారందరికీ సహాయం'
## గుంటూరు జిల్లా రాజకీయ బాధితుల మహాసభలో రెవిన్యూమంత్రి హామీ

తెనాలి, సెప్టెంబరు 7: గుంటూరు జిల్లా ప్రథమ రాజకీయబాధిత మహాసభ శ్రీ సాగి విజయరామరాజుగారి అధ్యక్షతను తెనాలిలోని రత్నాటాకీ సభాహాలులో నేడు జరిగినది. ఈ సభకు 1500 రాజకీయ బాధితులు విచ్చేసిరి. రెవిన్యూ మంత్రి గౌ॥ కళా వెంకటరావుగారు సభను ప్రారంభించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులైన మహమ్మద్ ఇస్మాయిలు సాహెబుగారు స్వాగతోపన్యాస మొసంగిరి.

కళా వెంకటరావుగారు సభను ప్రారంభిస్తూ యిలా ఉపన్యసించారు.

స్వరాజ్యనిర్వచనం కరాచీ కాంగ్రెసు సభలో నే చేయబడెను. రాబోయే కొత్త రాజ్యాంగంలో యుక్తవయస్కులకందరికీ వోటుయిచ్చే హక్కు ఉండును. ప్రజలందరు అన్నంకరువు బట్టకరువు లేకుండా సుఖంగా ఉండాలి. ఈ రోజు మద్రాసు రాజధానిలో ప్రజలు కరువుతో బాధపడుతుంటే పార్లమెంటు జార్జికోట గోడలమధ్య కూర్చుండి మంత్రులను ఊరిడీయగలరు. ఈ బాధ్యత మీ అందరిమీద నున్నదని గుర్తించ కోరతాను. స్వతంత్రముగా ఉండదలచిన భారతదేశంలో ఎనిమిది అధ్యాయాలు తిరగవలసివచ్చినది. యిప్పుడీ కష్టకాలంలో రెండుమాసాలు చాలా సహాయపడాలి.

కాంగ్రెసుకు సేవచేసినవారు తమకు ప్రతిఫలం కావాలని అడుగలేదు. కాని నేనే యీవిషయం బయటికి తీసినాను. నేనుకూడా రాజకీయ బాధితుడనే. చిరకాలం కష్టము లనుభవించుట దుర్ఘటం. నాప్రక్కవాడు బాధపడుతుంటే నేను చూచి సహించలేను. యుద్ధంలో బ్రిటిషు ప్రభుత్వమునకు తోడ్పడినవారికి భూములివ్వాలనే రికార్డు నావద్దకు వచ్చినప్పుడు దేశ కోసం స్వాతంత్ర్యసమరంలో దూకి బాధపడుచున్న నాతోటి రాజకీయ బాధితులు నాకు జ్ఞాపకంవచ్చారు. వారికికూడ శాంతిసౌకర్యము కలిగించాలని కోరిక కలిగింది. రాజకీయబాధితులలో పార్టీలు లేవు. దేశంకోసం త్యాగము చేసిన వారికందరికి సహాయం లభించగలదు.

కళా వెంకట్రావుగారు పై రీతిగా ఉపన్యసించిన పిమ్మట విజయరామరాజుగారు తమ అధ్యక్షోపన్యాసములో యీ క్రింది విషయములు చెప్పిరి.

### అధ్యక్షోపన్యాసం

బ్రిటిషు ప్రభుత్వమువారు లోగడ తరము సైనికులకు ఉద్యోగము లిచ్చెన్ని, భూము లిచ్చెన్ని ఒక సమూహాన్ని ఏర్పరచినారు. 1921 అనంతరము అనగా ప్రథమ సత్యాగ్రహ పోరాటానంతరం 1923 లో ఏలూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమున మన కళావెంకయ్యగారు కొందరు యువకులు గోలు గొల్పిన ఏర్పాటు :- నేడు మన మహాసభకు ప్రారంభోత్సవము సలుపవిచ్చేసిన రివిన్యూ మంత్రిగారు 5 కోట్ల మద్రాసు రాష్ట్ర ప్రజలందరి తరఫున నిమిత్త మాత్రుడుగా యీ భూదానమొనర్చు చున్నానని తలంచు నిగర్వ మాడామణియే గాని శ్రీ కళా బ్రహ్మయ్యగారి కుమారులు వెంకట్రావుగారు పిత్రుపితా మహార్జితమును అర్హులకు దత్తమొనర్చుచున్నానని తలంచునంతటి అహంకారులు కారని నావిశ్వాసము.

శ్రీ॥ శ్రీ॥ ఆంధ్రరత్నం గొల్లపూడి గోపాలకృష్ణయ్యగారు "ప్రజా నాయకుని నవ్యాహువ" మనేవారు. బ్రిటిషు రాజ్యాధికారం నిజమైనులకు కొంది వారల చేతినుండి ఆ కారాణ్యమునకు చెందవలెననియే మనమిన్నాళ్లు కృషిచేసినాము. అట్టి సంప్రాప్తమైనప్పుడు, ఆ ప్రజా ప్రభుత్వము మనల సత్కారించుననగా నిరాకరించుటను నంతటి తెలివితక్కువ నాకు ద్దతేను.

ప్రజాప్రభుత్వము అభిమానించి సత్కరింపగా దేశసేవకుడు ఆశీర్వచనముతో నంగీకరించి స్వీకరించుటకు తగినట్లువసతి కల్పించండి అని రివిన్యూమంత్రిగారికి నా అభిప్రాయము వివరించుచున్నాను. దేశసేవకబృందము ఒక్క జాబితాను తయారు చేయవలెను. ఏ పెద్దమనిషియైన విరరములతో పంపు జాబితా స్వీకరించి, నిజానిజములగాని పేర్లను అసలు జాబితాలో చేర్పవచ్చును. అప్పుడు దేశసేవకునకు ప్రభుత్వ నిర్ణయమును తెల్పు ఉత్తరువు జతపరచి "ఈస్వల్ప సత్కారమును స్వీకరింపుడు" అని దేశసేవకుని ప్రార్థిం చును. అట్టి మైన నమూనాగల అంగీకార పత్రికను అందుతో జోడించి పంపండి. అంగీకరించుట గాని అంగీకరింపక పోవుట గాని దేశసేవకు కేవిడవండి. పూర్వకాలంలో వచ్చిన ఇది అస్వ్యసంప్రదాయం ఇంతేకాని దరఖాస్తు పెట్టుకొని పలుకుబడిగల వారిచుట్టు, కలెక్టరు బంగాళాల చుట్టు గవర్నమెంటు సెక్రెటేరియట్ చుట్టు దేశసేవకులు తిరుగవలసిన అగత్య ము కల్పించకుడు. దేశసేవకబృందము లో గాంధియునిషను కు చెందినవారే గాక అంటరాని వారు కూడా చేరెదరు. అల్లూరి సీతారామరాజు యొద్దను బోయి సేవలు మున్నగు వారికి చెందినవారున్నూ ఉన్నారు. ఇద్దరు వ్యక్తిత్వంగమునుగనని యెంచి జైలుయాత్రను కొందరికి అఖిలభారత చరఖా సంఘము వారు నిషేధించిరి. అట్టివారిని కూడా సూరి బృందమున చేర్చవలెను. అగస్త్య శ్రీమంతుడు కాని సామాన్యసంసారియు, సంఘబలము లేకపోయినను దేశసేవయందు అన్ని అనర్థాంతరములను అనుభవించిన వారిలో యితరుడు మన రివిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు యీ వ్యవహారము లో మన ఆత్మగౌరవాభిమానములు రక్షింపగలమన ప్రతినిధి అని మాత్రము విశ్వాసముతో నేను చెప్పగలను.

ముసల్మానులను దారికి తెచ్చి దేశమును తిరిగి ఏకమొనర్చినగాని మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము సిద్ధించినట్లుకాదు. ఇప్పుడు మనకు లభ్యమైనది డొమినియను స్టేటసే. 1930 నుండి సాలుసాలున జనవరి 26 తేదీని మనము శపథ మొనర్చిన సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించలేదు. బ్రిటిషు సంబంధము పాకిస్తాన్ వదులుకోనక పోతే మనము వదులుకోనుట సాధ్యమా? ప్రస్తుతం సైన్యం అనేది జాయింటు డిఫెన్సు కవున్సిలు అధికారంలోనే ఉంది. ఉభయ రాజ్యాలు తమతమ సైన్యాలను పోషించుకోగల స్థితి వస్తేనేగాని సైన్యాలు విడివిడిగా విభజింపబడవు. రెంటిలో ఏ ఒక్క రాజ్యమైనను స్వసైన్య పోషణసామర్థ్యం కలిగినప్పటికీ సైనిక విభాగం జరుగదు. పాకిస్తానుకు అట్టి సామర్థ్యం ఎప్పుడువచ్చునో ఎవరు చెప్పగలరు? పాకిస్తానము బ్రిటిషు సంబంధము వదలుకోనంత కాలం మనమున్నూ వదులుకోలేము. అన్ని అనర్థములకు మూలము పాకిస్తానం. అది అంతరించి తిరిగి భారతదేశ మఖండ రాజ్యమైతే గాని మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం సున్న. ఇందుకు దేశీయులు తీవ్రకృషి చేయవలయును. అందున మనమంతా వారికి నిండా పని. నన్ని సభకు అధ్యక్షుడుగా నియమించిన ఆహ్వాన సంఘంవారికి ధన్యవాదము లర్పించుచున్నాను. ఈ సభ ఏర్పాటుఅయినదని నేను వినినకొలది రోజులకే మరోక గుంటూరు మండల రాజకీయబాధితుల సభ మరి మూడు రోజులలో తెనాలి పురమేల మగునని వింటిని. ఆసభకు శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రారంభోత్సవం సలుపుదురని వింటిని. ఈ సభకు శ్రీ వెంకట్రావుగారు ప్రారంభోత్సవం సలిపిరి. బహుశః యీ రెండు పంచవర్షములనుండి తాముసాధింప జాలనిదు మా తొక్క రక్తము వీదిగముగా సాధింపగల్గితిమని మా మిత్రులు చంకలు గుద్దుకొనుచున్నారేమో! నేను నా మిత్రులు కొందరును యీ రెండేండ్లుగా ప్రకాశంపంతులుగారి యోగక్షేమములకు వ్యతిరేకులమని నిరూపింప ధీరోదాత్త ప్రయత్నములు సల్పిరి. పంతులుగారి మాకను తరతముల స్నేహబాంధవ్యములు మప్పేట పెనవైచు కొని యున్నవని మీకు యెరుగరు.

### తీర్మానములు

రాజకీయ ఉద్యమాలలో కష్టనష్టముల కులోనైన రాజకీయ బాధితుల కుటుంబముల సహాయార్థం భూవసతి స్కీమును ప్రవేశపెట్టినందుకు మద్రాసు ప్రభుత్వమును వారిని యీసభ వారు అభినందిస్తున్నారు.

రాజకీయబాధితులకు మద్యపాన నిషేధ ఉద్యమంలో ఉద్యోగము లివ్వాలని, భూవసతి కల్పించాలని, గృహవసతి ఏర్పరచాలని, ఉచితవిద్య చెప్పాలని, రాజకీయ బాధితులు కోటి మాతాత గాదాలలో పొల్గొనరానిని రాజకీయబాధితులకిచ్చు భూవసతితోబాటు వారికి నీటివసతిని కల్పించాలని మిలిటరీవారికి మా దిరి సహాయము చేయుటకుగాను ప్రతి జిల్లాలోనూ సెంట్రలు ఆఫీసులు స్థాపించి కావలసిన సహాయములు చేయుటకు అవకాశాలు కల్పించాలని సత్యాగ్రహులు బాలబాలికలకు స్కాలరు షిప్పులు యిచ్చి సహాయము చేయవలెనని తీర్మానించుచు రాజకీయబాధితులకు సహాయసంపత్తులను కలిగించి తగిన కృషి చేయుటకుగాను యీ క్రిందివారికి కార్యనిర్వాహకవర్గముగా ఎన్నుకొనిరి.

(1) సాగి విజయ రామ రాజుగారు (అధ్యక్షు-) (2) నన్నపనేని వెంకటరావుగారు (కార్యదర్శి) (3) అనుకు సుబ్బారెడ్డిగారు (4) మొహమ్మదు ఇస్మాయిలు సాహెబుగారు (5) యలమంచిలి వెంకటప్పయ్యగారు (6) యామర్తి వెంకటప్పయ్యగారు (7) బెండనీ గారు (8) కాండూరి సీతారామయ్య గారు మున్నగు వారు ఎన్నుకోబడిరి.

# అసమానమైన శక్తిగల అద్భుత వ్యక్తి

### జ్యోతిష-సమ్రాట్
## పండిత రమేశచంద్రభట్టాచార్య

జ్యోతిష - శిరోమణి, యోగవిద్యా - విభూషణ, జ్యోతిషార్ణవ, సాముద్రికరత్న, ఎం. ఆర్. ఏ. ఎస్. (లండన్), ఆల్ ఇండియా ఎస్ట్రాలాజికల్ అండ్ ఎస్ట్రానామికల్ సొసైటీ 105, గ్రేస్ట్రీట్, కలకత్తాకు అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ప్రెసిడెంటు, ఇండియాలో సాటిలేని గొప్ప జ్యోతిష్కుడు, సాముద్రికశాస్త్రవేత్త, ప్రాచ్య ప్రతీచీ జ్యోతిష, సాముద్రిక, తంత్ర, యోగశాస్త్రములలో అఖండప్రజ్ఞాధురీణుడు.


ప్రెసిడెంటు

అత్యద్భుతశక్తులు గల ఈయోగి, అవిశ్వాసంతోనూ, సందేహాలతోనూ నిండివున్న యీ ప్రపంచానికి సవాలుగా—మానవు చూచినంత మాత్రాన అతని భూతభవిష్యద్వర్తమానములను తు. చ. తప్పకుండాచెప్పగల ప్రతిభతో యావత్ప్రపంచాన్ని దిగ్భ్రమ నొందించినాడు. అతని తాంత్రిక, జ్యోతిష శక్తులు సామాన్యప్రజలను మాత్రమే కాక ఉన్నత ప్రభుత్వోద్యోగులను, గొప్ప ఖ్యాతినాయకులను, మహారాజులను ఆశ్చర్యనిమగ్నులనుగాజేసి భారత పరిహద్దులదాటి ఇంగ్లండు, యూరోపు, యు. ఎస్. ఎ., చైనా, జపాన్, మలయా, స్ట్రెయిట్సు సెటిల్‌మెంట్సు, సింగపూరు ఇంకా ప్రపంచమున అనేక దూరప్రదేశాలలో ప్రజలమనస్సులందు నాటుకొని పోయినవి.

పండిట్‌జీకి ఆయాచితంగా, ఈ దేశములలోని గొప్పవారినుండి పొగడుతూవచ్చే లెక్కలేనన్ని ఉత్తరముల అసలుప్రతులు, నిత్యమూవచ్చే అనేక ఉత్తరములు సొసైటీ యొక్క హెడ్డాఫీసులో చూడవచ్చును.

డి. ఎన్. జోషి, ఎస్. డి. ఒ., (ఎలక్ట్రికల్) సిమ్లా, సెంట్రల్ డివిజన్—"మీ శాహు, బగళముఖి కవచాలు అత్యద్భుతంగా పని చేశాయి. ఇందుకు మీ కెప్పుడూ కృతజ్ఞుడనై వుంటాను."

ది హానరబుల్ జస్టిస్ బి. కె. రాయ్ ఆఫ్ పాట్నా హైకోర్టు—"నన్ను చూసీ చూడటంతోనే నా ఆలోచనలన్నీ వివరించడం మొదలుపెట్టాడు. అనేక సంగతులు అద్భుతంగా చెప్పాడు. అతడు నిజంగా అతి మానుషశక్తిగల మహాపురుషుడు."

ది హానరబుల్ మినిస్టర్ రాజా ప్రసన్నదేవ్, రాజకోట, గవర్నమెంటు ఆఫ్ బెంగాల్ :—"అతని అద్భుతశక్తి, తాంత్రిక విజ్ఞానము అనేకసందర్భాల్లో నన్ను ఆశ్చర్యచకితుని గా చేసినవి. నిజంగా అతని విద్య అతను గొప్పవాడు."

ది హానరబుల్ జస్టిస్ ఎస్. ఎం. దాస్ ఆఫ్ కియోంఝార్ స్టేట్ హైకోర్టు:—"నా విగతజీవుడైన కుమారునకు పండిట్‌జీ తిరిగి ప్రాణం పోశాడు. నా జీవితంలో అటువంటి తాంత్రికయోగిని ఎన్నడూ చూడలేదు."

మహామహోపాధ్యాయ, పండిత రామచంద్రనయాచార్య, తర్కతీర్థ, డిపార్టుమెంటు ఆఫ్ నయాఫిలాసఫీ అధ్యక్షుడు, హిందూ యూనివర్సిటీ, బెనారెస్, సెక్రటరీ, వారణాసి పండిత సభ:—"శ్రీమాన్ రమేశ చంద్రుడ జ్యోతిశ్శాస్త్రంలో గల అనేకక్లిష్ట, చిక్కు సమస్యల్ని తన నిరంతర విమర్శనచేత విజ్ఞానంచేత విడగొట్టి యీ పురాతన శాస్త్రానికి క్రొత్త గౌరవాల్ని తెచ్చిన కీర్తి పొందాడు. ఈ గౌరవాలన్నిటిని పొందుటకు ఆయన తగినవాడు."

మహామహోపాధ్యాయ పండిత హరిహర కృపాలు ద్వివేదిశాస్త్రి (యు. పి.) భారతదేశంలో చిరకాలంనుంచి సకల శాస్త్రపారంగతులై విజ్ఞానాన్ని సంపాదించిన వారిలోనొకరు:—"శ్రీమాన్ రమేశచంద్రుడ జ్యోతిశ్శాస్త్రంలో అత్యద్భుతమైన ప్రతిభను సంపాదించాడు. అతనిని ఒక్క బెంగాలే కాదు, అఖిలభారత దేశము చెప్పుకొ గర్వించదగినవాడు."

మహామహోపాధ్యాయ భట్టాచార్య పండిత హరిదాస్ సిద్ధాంత భాగీష్, గొప్ప విజ్ఞాని, కవి:—"శ్రీమాన్, రమేశ చంద్రుడ యువకుడే అయినా అద్భుతశక్తులుగలయోగి తంత్రములలోను, జ్యోతిషములోను వీరికి గొప్ప ప్రవేశం వుంది."

కె. ఎ. లారెన్స, ఒసాకా, జపాన్ :—"మీ కవచములవల్ల మంచిఫలితాలు పొందుతున్నాను. నేను వాటిని ధరించిననాటినుండి మా కుటుంబ పరిస్థితులన్నీ మారినవి."

ఆండ్రూ టెంపో, 2728, పాపులర్ అవన్యూ, చికాగో, ఇల్లినోయిస్, యు.ఎస్.ఎ. "రెండుమూడు సందర్భాల్లో మీవద్ద అనేక కవచాలు కొన్నాను. అవి అన్నీ చక్కగా పనిచేసినవి."

ఎఫ్. డబ్ల్యు. గిల్లెస్పీ, డెట్రాయిట్, మిచిగాన్, యు. ఎస్. ఎ. "మీ ప్రత్యేక ధనదకవచాన్ని ధరిస్తున్నాను. ఇదివరకటికన్న నా పరిస్థితులు ఇపుడు చక్కగావున్నవి."

కె. రూచ్ పాల్, షాంఘై, చైనా :—"ఆశ్చర్యం గొలిపేట్టు సరిగా మీరు వ్రాసియిచ్చినట్టు ప్రతీవిషయం జరుగుతోంది."

ఇసాక్ మూమి ఎట్టా, గవర్నమెంట్ క్లర్కు అండ్ ఇంటర్ ప్రిటర్, జెక్వాంగ్, పడమటిఆఫ్రికా:"నేను మీవద్దనుంచి తెప్పించిన తాయతులు చక్కగాపనిచేసినవి."

1939 సెప్టెంబరులో యుద్ధం ప్రారంభమయిన 4 గంటలలో మిత్రమండలికే విజయం కలుగుతుందని జ్యోతిషముచెప్పిన జోస్యుకు ఇండియాలో-ప్రపంచానికంతటికి జ్యోతిష సామ్రాట్ పండిత రమేశచంద్రుడొక్కడు మాత్రమే. ఈ అత్యద్భుత జోస్యం నెరవేరినందుకు, హిస్ మెజస్టీ కింగ్ జార్జి VI రాజప్రతినిధి, బెంగాల్ గవర్నరులనుండి పొగడ్తలు, గౌరవ మర్యాదలు లభించినవి. అలాగే పండిట్‌జీ (హెడ్‌కోలా పోస్టాఫీసులోని 3-9-46 తేదీగల 19 నెం టెలిగ్రాము, డి. 6-9-46 తేదీగల సొసైటి ఆఫీసుయొక్క నెం. 7365 జాబు చూడండి) 1946 సెప్టెంబరు 2 వ తారీఖున భారత రాజకీయ మహానాయకుడగు పండిట్ నెహ్రూ అధ్యక్షతన్ని ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వముయొక్క భవిష్యత్తునుగురించి అది ఏర్పడిన ఒకగంటలోనే చెప్పిన ఫలితాలు క్రమక్రమముగా ఋజువగుచున్నవి. అంతేగాకుండా భారతదేశంలో పదునెనిమిదిమంది మహారాజులకు వీరు స్థిరమైన జ్యోతిష సలహాదారుగానున్నారు.

1938 సం॥ డిశంబరున కలకత్తాయందు సమావేశమైన భారతీయ పండిత మహామండలిలో భారతదేశపు అన్ని ప్రాంతములనుండి సందమందికిపైగా వచ్చిన ప్రొఫెసర్లు, విజ్ఞానవేత్తలు వీరి అద్భుత శక్తులకు, మేటి జ్ఞానానికి మెచ్చి "జ్యోతిష శిరోమణి" అను బిరుదునిచ్చి గౌరవించారు.

ఇంతేకాకుండ, 9-2-1947 తేదీన కాశిలో కాశీపండిత సభయొక్క వర్ధంతి సమయమున భారతదేశంలో వివిధ ప్రాంతాలనుండివచ్చిన రెండువందల యాభైమంది విఖ్యాత వైజ్ఞానికులు, ప్రొఫెసర్లయెదుట జోస్యపు బిరుదులన్నిటిలోకి మిన్నయైన "జ్యోతిష సామ్రాట్" అను బిరుదు వీరి కొసంగబడెను. ఇక్కడ ముఖ్యంగా గమనించదగినది యేమంటే, యింతవరకు భారతచరిత్రలో ఇట్టి మహాగౌరవమును ఏ జ్యోతిష్కుడు పొందియుండలేదు.

యోగిక, తాంత్రికక్రియల సహాయంతో యీ మహాపండితుడు, కష్టసాధ్యము, అపాయకరము అయిన వ్యాధులను, వైద్యులు, కవిరాజులు, లాభం లేదని వదలివేసిన అనేక రోగములను, కుదిర్చినారు. క్లిష్టంగా వున్న కోర్టు దావాలలో నెగ్గుటకు సహాయపడినారు. అన్నిరకాల అపాయాలనుండి ప్రజలను విముక్తుల జేసినారు. సంతానంలేని కుటుంబాలకు సంతానం కలుగునట్లు ఆశీర్వదించినారు. జీవితంలో రక్షణ, నిశ్చింతఐశ్వర్యము అనేకవేల ప్రజలకు కలుగజేసినారు.

జీవితంలో ఆశను గోల్పోయినవారూ, తమజీవితము నిరర్థకమైనదని నిస్పృహ నొందినవారు, పండిట్‌జీని సంప్రతించి వారి అత్యద్భుతశక్తులను గురించి స్వానుభవముగ తెలిసికొనవచ్చును.

### వేలకొలది వచ్చినవాటిలో కొన్ని అభిప్రాయములు

హిస్ హైనెస్ ది మహారాజా ఆఫ్ అటారా : "పండిట్‌జీయొక్క మానవాతీతమగు శక్తికి, ఆశ్చర్య చకితుడనైతిని. అతడు గొప్ప తాంత్రికుడు.

హెర్ హైనెస్ 6 వ డొవాగర్ మహారాణి సాహెబా ఆఫ్ త్రిపురాస్టేట్ "అతని అఖండ తాంత్రికశక్తికి, కవచముల ప్రభావమునకు నాకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది ఇతడు అద్భుత శక్తులుగల ఉత్తమవ్యక్తి అనడానికి సందేహంలేదు."

హెర్ హైనెస్ మహారాణి సాహెబా ఆఫ్ కూచ్ బీహార్:—"రాజకుటుంబంలోని అనేకమంది మీ కవచాలు ధరించడంవల్ల వారికి మంచి ప్రయోజనములు చేకూరటము కనుగొన్నాను."

ది సెకండ్ కుమార్ శ్రీ రమేంద్రనారాయణ్ రాయ్, భోవాల్ సన్యాసికేసులో ప్రఖ్యాతి నొందినతడు:—"మీరు నాకు సాయపడుతున్నారు. మీ సహాయమే నాకుగొప్ప అంగరక్ష."

ది హానరబుల్ చీఫ్ జస్టిస్ ఆఫ్ కలకత్త హైకోర్టు సర్ మన్మథనాథ ముఖర్జీ కె టి "శ్రీమాన్ రమేశచంద్రులవారి ఆశ్చర్యకరమైన గణితం, విజ్ఞానము, తండ్రికి తగిన కొడుకు పుట్టటంవల్ల కలిగిన ఫలితము."

ది హానరబుల్ మహారాజా ఆఫ్ శాంతోష్ ఎక్స్ ప్రెసిడెంట్, బెంగాల్ లెజిస్లేటివు కౌన్సిల్ సర్ మన్మథనాథరాయ్ చౌదరి కె. టి.,—"నా భావిని గురించి పండితులవారి జోస్యము అక్షరాలా జరిగినది. అతడు నిజంగా అసాధారణ శక్తిగల గొప్ప జ్యోతిషశిఖామణి."

రాజా వినయేంద్రనాథ్ రాయ్ చౌదరి ఎం. ఏ. (కాంటాబ్), బార్-ఎట్-లా ఆఫ్ శాంతోష్—"పండిట్‌జీవంటి గొప్ప జ్యోతిష్కుని ఎక్కడా చూడలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే అతను గణితం చేసినంతా నిజం. అతడు అతిమానుషశక్తులుగల గొప్ప వ్యక్తియని చెప్పవచ్చును."

దివాన్ బహదూర్ కె. సూర్యనారాయణమూర్తి, కాకినాడ (మద్రాసు)—"ప్రెసిడెంట్, పండిట్‌జీ కవచం ధరించడంచేత వారి ఆశీస్సులవల్ల రెండు ముఖ్యమైన దావాల్లో గెలిచాను. 12-8-47.

మేజర్ జెకేశ్వర్ చెటియా, రిజిమెంటల్ సెంటర్, హాపీవాలీ, షిల్లాంగ్, (అస్సాం)—"నేనూ, నా భార్య, బగళముఖి, ధనదకవచాలు ధరించడంచేత అద్భుతమైన ఫలితాలు పొందగలిగినాము."

బి. జె. ఫెర్నాండో, ప్రొఫెక్టర్, ఎస్. సి. అండ్ నోటరీ పబ్లిక్, కొలంబో, సిలన్:—"మీ కవచాలవల్ల అద్భుతమైన ఫలితాలు పొందాను. ప్రతి సంవత్సరం నాతో 3 వేల రూపాయలకుపైగా వ్యాపారిస్తున్నాను."

తెలిసిన్నీ వడుకు కొన్నవారు పండిట్‌జీ శక్తిప్రభావములను పరీక్షించి చూడవలసినదిగా కోరుచున్నాము.

## అద్భుత తాయెత్తులు (గ్యారంటీ)

పనిచేయనిచో డబ్బు వాపసు.

### ధనదకవచము, లేక రోత్సుచైల్డు తాయతు

దీనిని ధరించినవారు కొద్ది శ్రమతో అధికధనాన్ని ఆర్జించగలరు, ఎప్పుడైనా, దేన్నిగురించైనా తలచుకున్నంత మాత్రాన అది నెరవేరుతుంది. లక్ష్మీదేవి వారి యింట్లో స్థాయిగావుండి, పుత్ర సంతానం అపారసంపద, దీర్ఘాయువు, పేరుప్రతిష్టలు చేకూర్చును. దరిద్రుణ్ణి కూడ (తంత్రములో వ్రాసియున్నప్రకారం) రాజువలె ధనవంతుని చేయును. వెల రు. 7-10-0 ప్రత్యేకపుది, శీఘ్రప్రయోజనాన్ని కల్గించగల ప్రభావంగలది. రు. 29-11-0 అత్యధిక ప్రయోజనంగల సూపర్ స్పెషల్ రు. 129-11-0.

### బగళముఖి కవచము

ఇది మీ శత్రువులను జయించుటకు తోడ్పడును. ఈ కవచప్రభావంవల్ల దీనిని ధరించినవారు ఉద్యోగంలో అభివృద్ధి, అధికారప్రాపకము పొందగలరు. సివిల్, క్రిమినల్ వ్యాజ్యములలో గెలుపుచేకూర్చుటకు సాటిలేనిది. ఇది అన్ని ప్రమాదములకు, అపాయములకు రక్షణము. వెల రు. 9-2-0 ప్రత్యేకపుది శీఘ్రప్రయోజనాన్ని కలిగించేది రు. 34-2-0 (భోవాల్ కేసును గెలిచిన భోవాల్ కుమార్ దీనిని ధరించిరి) అత్యధిక ప్రయోజనంగల సూపర్ స్పెషల్ రు. 184-4-0.

### వశీకరణ (మోహిని) కవచం

కోరినవారిని తప్పక చెప్పుచేతలలోనికి తీసుకొనివచ్చును. వెల రు. 11-8-0 ప్రత్యేకపుది, సత్వర ప్రయోజనకారి రు. 34-2-0 అత్యధిక ప్రయోజనంగల సూపర్ స్పెషల్ రు 387-14-0.

### నృసింహ కవచము

ఈ కవచము ధరించినయెడల స్త్రీల గర్భస్రావముపోవును. స్త్రీల జబ్బులు కుదురును. పొత్తికడుపులో గడ్డ కట్టుకున్న రక్తమునదలును. బహిష్టు సక్రమమగును. అధికరక్త స్రావమునకును. జననేంద్రియము క్రమస్థితికివచ్చును. దయ్యములనుండి భూతములనుండి రక్షించును. వెల రు. 7-5-0. శీఘ్ర ఫలితముల గూర్పు స్పెషల్ రు. 18-9-0 సూపర్ స్పెషల్ రు. 63-9-0.

### సరస్వతి కవచము

ఇది ముఖ్యంగా బాలబాలికలకు పనుము వారికి ఉపయోగపడును. పరీక్షలలో తరచు తప్పే, జ్ఞాపకశక్తిలేక ఖిన్నులై జీవితం గడిపేవారు దీనిని ధరించాలి. ధర రు. 9-9-0 స్పెషల్ రు 38-9-0 సూపర్, జీవితపర్యంతమూ మంచిఫలితాలు ఇచ్చేది రు. 427-13-0.

N. B:—ఇవేగాకుండా జీవితమంతా అసాధారణ ఫలితాలుయిచ్చే అనేక ఖరీదైన కవచాలు వున్నవి. కోరినచో ఉచితముగా పంపబడు మా కేటలాగులో చూడవచ్చును.

## ఆల్ ఇండియా అస్ట్రాలాజికల్ అండ్ అస్ట్రానామికల్ సొసైటీ.

రిజస్టర్డు (స్థాపితం. 1907 A. D.)
(దూరప్రాచ్యంలోనూ భారతదేశంలోనూ ముఖ్యమైన, పురాతన అస్ట్రాలాజికల్ సొసైటి.)

హెడ్డాఫీసు : 105 గ్రేస్ట్రీట్, "వసంతనివాస్" కలకత్తా (శ్రీశ్రీ నవగ్రహ & కాళీ దేవాలయం.)

సంప్రదించు వేళలు : ఉదయం 8-30 మొదలు 11-30 వరకు ఫోను B B. 3685.

బ్రాంచిఆఫీసు : 47 ధర్మతల్లావీధి (వెల్లెస్లీ జంక్షన్) కలకత్తా, ఫోను Cal 5742.

సంప్రదించు వేళలు : సాయంత్రం 5-30 మొదలు 7-30 వరకు.

లండన్ఆఫీసు :—మిస్టర్ ఎం. ఎ. కర్టిస్, 7-A, వస్ట్ వే, రేనెస్ పార్క్, లండన్.